చాసో 1843లో 'బొండు మల్లెలు' అనే కథ రాశారు. 1968 లో 'బండపాటు' అనే కథ రాశారు. 'బొండు మల్లెలు' అనే కథలో జబ్బు పడ్డ ముసలి వాణ్ణి కూతురు చూసింది కాదు. 'బండపాటు' కథలో చచ్చిన వాడి కోసం పెళ్లాం కాని, తల్లి కాని, మేస్త్రి సత్యం కాని, నోరున్న నాగన్న గాని, కనిపెట్టుకున్న కనకమ్మ గాని నిజంగా ఏడవ లేదు. అంతర్నిర్మాణంలో ఈ రెండు కథల్లోను 'సృజన సందర్భం, ఒకటే. 'లేమి ఎంతటి వాళ్లలోనైనా మానవత్వాన్ని చంపి అమానుషత్వాన్ని పెంచుతుంది.' అనేది ఇక్కడి కథా సూత్రం. బహిర్నిర్మాణ పరంగా ఈ కథల్లోని సృజనాత్మక సందర్భం భిన్నమైనది. అందుకే ఇవి రెండు కథ లయ్యాయి. రెండు ఆకృతులు ధరించాయి. అయితే ఈ రెండు కథల్లోను ఏ పాత్ర మీద పాఠకులకు అసహ్యం కలుగదు. 'బొండు మల్లెలు' కథలో ఫలితం కష్టపడ్డ వాడికి కాకుండా పోయింది' అనే పశ్చాత్తాపం ఆ గృహస్థుకు మాత్రమే కాక పాఠక వర్గంలో కూడా స్థిరపడి పోయింది. పశ్చాత్తాప పడవలసిన పరిస్థితులను ముందుగా ఎదిరించ గల మనః పరిపక్వతకు మార్గదర్శక మయ్యే అనుభూతిని మిగల్చడమే చాసో కథాతత్త్వం.

కథ కాలక్షేపానికి కాదు. కన్నీళ్లకు కాదు. ఆవేశ కావేషాలకు కాదు. అసభ్యతకు, అనర్థానికి, అస్తవ్యస్తతకు అసలే కాదు. అనుభూతికి, ఆలోచనకు ఆచరణకు అని చాసో విశ్వాసం. చాసో కథ రాయడానికి ఎంతకాలం పడుతుందో సరియైన పాఠకుడికి అది అర్థం కావడానికి కూడా అంత కాలం పడుతుంది. చాసో దృష్టిలో కథకుడు బోధకుడు, శాసకుడు కాదు. మాంత్రికుడు, తాంత్రికుడు అసలే కాదు. అందుకే చాసో కథలు ఎర్ర చొక్కాలు తొడుక్కోవు. సందేశాల మూర్ఛ బిళ్లలు మెళ్లో వేసుకోవు. మత్తుమందు జల్లి మైమరపించవు, వాస్తవాన్ని ఒక విశిష్ట వాస్తవికతగా రూపొందించడంలోను, గ్రహించడంలోను ఆలోచనాతీత ధార అటు కథకుడిలోను, ఇటు పాఠకుడిలోను మెరుస్తూనే ఉంటుంది. అటు కథకుడు కదలడు. ఇటు పాఠకుణ్ణి కదిలించాడు. కాని ఆలోచన ఇద్దరిలోనూ పరుగులు పెట్టూ ఉంటుంది. అక్కడ 'రంగు రింగు గింగురు' ఉండవు. ఇది చాసో కథా తత్త్వ రహస్యం.

సూది బెజ్జం లోంచి విశ్వాన్ని చూడగలిగే సూక్ష్మ జ్ఞానేంద్రియంతో మానవ లోకాన్నవలోకించి అనుభవాలని, ఆదర్శాలని ఆత్మనీ ప్రకృతినీ సమన్వయిస్తూ మహా కావ్యం సృష్టి చేయాలంటాడు చాసో. కథకు ఆయనిచ్చిన నిర్వచన మిదే. అనుభవాలు - ఆదర్శాలు - ఆత్మ - ప్రకృతి ఇవే కథా సామగ్రి. కథలో ఈ అంశాల ప్రాధాన్య క్రమం కూడా ఇదే. ఇందులో ఏదీ ఒక దానిని ఒకటి అతిక్రమించే ప్రయత్నం చేయదు. ఈ నాల్గింటిని ఏకం చేయడంలో చాసో కథా శిల్పం జీవం పోసుకుంటుంది. 'పరబ్రహ్మం' కథ ఇందుకు మచ్చు తునుక.

స్వచ్ఛమైన కళారూపం ఆత్మ యొక్క అజ్ఞాత అగాధ ప్రదేశాల నుండి ఆవిర్భవిస్తుందని Eliseo vivas అనే విమర్శకుడు చెప్తాడు. చాసోకి బాల్యం నుండి స్నేహితులంతా బీద వాళ్లే. అతని అలవాట్లూ బీద అలవాట్లే. చుట్ట దానికి సంకేతం అని మాట వరసకు అనుకోండి. ధన వంతులకు ఎక్కువ మంది స్నేహితు లుండరనేది ఆయన విశ్వాసం. ధనానికి, స్నేహానికి చుక్కెదురని ఆయన తలంపు. చాసో ఆత్మ ఈరకమైన అభిప్రాయాలకు కట్టుబడి ఉన్న కారణంగానే అతని కథలు ధనవంతుల చుట్టూ కాక బీద వాళ్ల చుట్టూ అల్లుకున్నాయి. ధన వంతుల ప్రస్తావన వచ్చిన కథల్లో వారి దౌష్ట్యాన్ని, ఆడంబరాన్ని, అవినీతిని, అమానుషత్వాన్ని వెల్లడించడం మాత్రమే కనిపిస్తుంది. 'కుంకుడాకులో భుక్త', 'కొండ గెడ్డ'లో, ఇంజనీరు, 'బూర్జువా కుక్క', లోని

స్థితిపరుడు, 'ఆహోహో'లో దండపాణి 'చెప్పకు చెప్పకు'లో, రాజరత్నం, 'ఫారెన్ అబ్బాయి'లో చిట్టెయ్య కొడుకు - వంటి వాళ్లందరూ ఏదో-ఒక కోణంలోంచి అసహ్యించుకో దగ్గవారే. మంచి ధనవంతు డొకడు కూడా చాసో కథల్లో కనిపించడు. ధనాశాపరులను దోషులుగా నిలబెట్టడం కూడా చాసో కథాతత్త్వంలో ఇమిడివుంది. 'జంక్షనులో బడ్డీ'లో అప్పల్నాయుడు, 'బొండు మల్లెలు'లో గృహస్థు ఈ కోవకు చెందిన వారే.

రచయిత శీలము - దృఢవాంఛ - విలక్షణ ముద్ర - అంతర్విచారము- వ్యక్తిగత దృక్కోణము అనేవి అతని సృజన రూపానికి చెందిన తత్త్వాన్ని రూపొందిస్తాయి. చాసో ఆత్మ యొక్క అజ్ఞాత అగాథ ప్రదేశాలలో నిండినది బీద వాళ్ల వేదన. రచయితగా ఆయన దృఢమైన క్రమశిక్షణ కలవాడు. అందుచేత అతని కథ లన్నింటిలోనూ వేదన అంతస్సూత్రంగా నిలిచివుంది. అతని సృజనలో ఏ ఒక్కటీ అకస్మాద్దర్శనం కాదు. ఆ కథలు అతని దృఢవాంఛ యొక్క చికిలిసేతలు. అవి గాలి తాకిడికి రూపాలు మార్చుకునే శిలలు కావు. ఒక వాంఛతో మలిచిన శిల్పాలు. చాసో కథల నిండా తన ఆలోచనలు, అనుభూతులు నిండి ఉంటాయి. ఇతరమైన వాటికి ఆ కథల్లో స్థానం లేదు. 'అనేక విషయాలలో సమాధాన పడుతూ ఉంటేనే జీవితం ఎవరికైనా గడుస్తుంది. అనే విషయం వ్యక్తిగత జీవన సరళికి చెందినది కావచ్చు గాని రచయితగా సృజన వ్యాపారంలో ఈ విధమైన రాజీకి చాసో అంగీకరించలేదు.

రచయితలలో ఇంకొక రకమైన రాజీ లక్షణం ఉంటుంది. వారు మానవు లంతా వేరు వేరు స్థాయిలలో బాధను పొందే ఆంతరిక ఉద్రేకాలకు, చీలికలకు రాజీ కుదర్చడానికి లేదా ప్రతీకాత్మకమైన పరిష్కారాలను సూచించడానికి తమ సృజన శక్తులను సమీకరిస్తారు. చాసో తన కథలలో ఈ రకమైన రాజీకి గాని, ప్రతీకాత్మక పరిష్కారానికి గాని స్థానం కల్పించ లేదు. రాజీ ఆయన తత్త్వానికి విరుద్ధమైనది. పరిష్కారం అసహజమైనది. వేదన ఒక నిరంతర ప్రవాహం. వేదనకు గురికావడమే వాస్తవికత వాస్తవికత. అనే నిస్తరంగ తటాకం ఒడ్డున కూర్చుని అందులో పరిష్కారమనే గులక రాయి ఒక్కటి కూడా విసర కుండా, ఆ వేదనకు సంబంధించిన ద్రవ్యం - వస్తువు- మస్తిష్కం వేరు చేయడానికి వీలులేని రీతిగా తన చైతన్యంలోని పొర నుండి పొరకు తవ్వుకుంటూ ఒక కథను మలచడం చాసో తత్త్వం! విప్లవ బీజాలు మనుషుల్లో ఉంటే కవులు వీరగేయాలు పాడాలా? అన్నది చాసో ప్రశ్న. నిర్దిష్టమైన పరిష్కారాలతో, రాజీలతో ఆ బీజాలు నాటే బోధ కన్న, వాస్తవికతా స్పృహ కల్గించడం ద్వారా, ఒక గుర్తింపు కలిగించడం ద్వారా ఆ పరిణామాన్ని సాధించా లనేది చాసో కథా తత్త్వం.

అభ్యుదయ రచయిత లనేకులు సృజనలో కొత్త సూత్రాలను ప్రవేశపెట్టారు. సంప్రదాయాన్ని తిరస్కరించారు. లోకం పట్ల మానవుని అవగాహనను మార్చారు. సర్వ సమ్మతములైన మానవాను భవాలను అతిక్రమించారు. అవి పరివర్తన పొందేలా చేశారు. ఆ విధంగా మానవుని ఉనికిలో నూత్న పరిస్థితులను కల్పించడానికి దోహదం చేసారు. మన దేశానికి స్వాతంత్రం రావడానికి కొంచెం ముందు వెనుకలుగా ఈ రకమైన మార్పుకు సంసిద్ధతను కలిగి ఉండడం ఒక సామాజిక వాస్తవికత అయితే ఆ స్పృహ సమాజంలో సర్వాంగీణంగా రూపొంద లేదు. ఆ స్పృహ కలిగిన వారు కొందరు, ఈ స్పృహ అందని వారు కొందరు. అ స్పృహను అణిచి పెట్ట జూచిన వారు కొందరు. ఈ అపరిపక్వ స్థితిలో పరుచుకున్న వాస్తవి కతను, దాని నంటి పెట్టుకున్న వేదనను

కళాత్మకంగా ప్రదర్శించడం చాసో కథా తత్త్వమ యింది. '' ఏమి తీర్పు చదివించి వింటున్నాడు గాంధీ మహాత్ముడు'' అంటారు చాసో 'కొండగెడ్డ అనే కథలో! గాంధీ విన్న లక్ష లాచీ తీర్పులు సరియైన తీర్పులు కావన్నమాట. 'నాకు తెలుసు నాది సత్యాగ్రహమని' అన్న చాసో వాక్యంలో స్ఫురిస్తుంది. గాంధీని గాంధీగా కాకుండా మార్క్సుని మార్క్సుగా కాకుండా ప్రజలకు అందించడమే చాసో కథా తత్త్వం. 'చెప్పకు చెప్పకు' అనే కథలో ' ఈ వ్యక్తులు వ్యక్తుల వల్ల మారరు. వ్యవస్థ మార్చాలి' అంటాడు సత్యం. ఆ సత్యాన్నే చాసో కథా తత్త్వం చాటుతుంది.

సౌందర్యా రాధన, సౌందర్యాబివ్యక్తి అనే అభిరుచుల జంట చాసోలో కూడా ఉంది. అయితే సృజన రూపానికి చెందిన సౌందర్యం విలక్షణమైనది. చీపురు డొంకలాగ తెల్లగా మీదికి లేచి ఉన్న జుట్టును ముడి వేయడంలో ముసలమ్మలో సౌందర్యం కోసం ఉన్న తపన లౌకికమైనది. నీడలు, ఎండ వెలుగులూ పడి దాని మొహంలో నిండిన ఎనభై ఏళ్ల జీవితపు బాధ, మరణ వేదన ఒడిసి పట్టు కోవడం కళా సౌందర్యం. ముసిలి దానికీ చిత్ర కారుడికీ మధ్య నడచిన ఇతివృత్తం 'మనిషిని మని షి ఏం చేస్తున్నాడో' అనే సత్యం. సమాజపు నరనరాల్లో ఇంకిపోయిన ఈ దోపిడీ తత్త్వాన్ని, దాని ఫలితంగా పరుచుకున్న వేదనను సుందరంగా ఆవిష్కరించడమే చాసో దృక్పథం.

చాసో కథలు సాధారణమైన ఊహలతో నిండినవి మాత్రం కావు. ఆ కథల్లో అతనిదైన ఒక అంతర్బుద్ధి ఇమిడి ఉంది. ఊహలు ఆ బుద్ధికి వాహకాలుగా ఉపయోగించాయి. 'రాజు గారు మంతిరేమిటి ', 'వృద్ధాప్యపు పెన్షన్లు ఏర్పాటు చేస్తే బాగుండును', ' మంచి పనీలోకంలో ఎవడూ చెయ్యడు' సదువుకున్నోళ్లకి ఉద్యోగాలు ఎక్కడివి' వంటి వాక్యాలలో చాసో అంతర్బుద్ధి కనిపిస్తుంది. ఆ వాక్యాలు, వాటి సారం నేటి సమాజంలో ఎలాంటి రూపాలు పొందాయో మనం గ్రహించగలం. ఆ రకంగా చెప్ప గలగడం మేధావుల లక్షణం. సాధారణ జనం సహజంగా గ్రహించ లేని దానిని తాను దర్శించి అందరికీ చూపించడమే కళాకారుడి ప్రవృత్తి. మన చైతన్యానికి అందకుండా ఉండే వాస్తవికతను స్పష్టంగా స్ఫురింప జేసే తత్త్వం చాసో కథల్లో ఉంది.

# Swami Vivekananda

' The one thing that is at the root of all evils in India is the condition of the poor. The poor in the West are devils; compared to them ours are angels, and it is, therefore, so much the easier to raise our poor. The only service to be done for our lower classes is to give them education, to develop their lost individuality... Priest-power and foreign conquest have trodden them down for centuries and at last, the poor of India have forgotten that they are human beings. They are to be given ideas; their eyes are to be opened to what is going on in the world around them; and then they will work out their own salvation. Every nation, every man, and every woman, must work out their own salvation. Give them ideas - that is the only help they require, and then the rest must follow as the effect. Ours is to put the chemicals together, the crystallisation comes in the law of nature.. This is what is to be done in Inida... If the poor cannot come to eduction, eduction must go to him...

'The life is short, the vanities of the world are transient, but ***they alone live for who live*** for ***others; the rest are more dead than alive.***

# యయాతి

మూలం : జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఖండేకర్          సమీక్షకుడు : ఎస్. సదాశివ

''నేను - నే నెవరు? ఎక్కడున్నాను నేను? స్వర్గంలోనా? నరకంలోనా? నేను యయాతి నేనా? నహుష మహారాజు పుత్రున్ని - హస్తినాపుర మహారాజును - దేవయాని పతిని - నేనేనా?

దేవయాని? ఎక్కడి దేవయాని? దేవయాని నా కేమీ కాదు- ఏమీ కాదు.

ఏమీ కాదని యెలా అనగలను? ఆమె నా పూర్వజన్మ శత్రువు - ఆమే - ఆమే నన్నీ నరకంలో త్రోసింది.

నేను నరకంలో వున్నానా? కాదు - ఎంత వెర్రి వాణ్ని నేను? ఇది నరకం కాదు. స్వర్గం - ఎన్నో యేళ్ల నుంచి ఈ స్వర్గ సుఖా లనుభవిస్తున్నాను.

ఏన్నేళ్ల నుంచి? పద్దేని మిదేళ్ల నుంచా? కాదు పద్దెనిమిది వందల సంవత్సరాల నుంచి నేనీ స్వర్గంలో వున్నాను. అవిరతంగా అప్సరసల ఆధరామృత పానం చేస్తున్నాను. కల్పవృక్షం క్రింద వున్నది నా ఆసనం - పారిజాతాలు పరచిన తల్పం మీద ఆహో రాత్రాలు ఆనందిస్తున్నాను - ఇంద్రాణిని నా బాహు పాశాల్లో బంధించుకుంటా నిక.

ఇంద్రాణి - ఇంద్రాణి కారణంగానే గదా నహుష మహారాజు భయంకర శాపానికి గురి అయ్యాడు! ఎవరో నా చెవిలో గుసగుస లాడు తున్నారేమి? '' నహుషుని సంతానానికి సుఖం దొరకదు.''

నేను నహుష మహారాజు కొడుకునే గదా! సుఖిస్తున్నాను. మా అన్న యతి అరణ్యాలు పట్టుకొని పోయాడు - పిచ్చి వాడయ్యాడు. నేను ఆనంద సముద్ర తరంగాల్లో ఓలలాడుతున్నాను - నా దుఃఖా లన్నిటిని ఈ సముద్రంలో ముంచి వేశాను.

కాని - కాని - ఒక్క దుఃఖం మాత్రం నాలో వున్నది. శర్మిష్ఠ జ్ఞాపకం - ఎక్కడుండి వుంటుంది శర్మిష్ఠ? ఈ దుఃఖాన్ని మద్య పాత్రలో ముంచి వేయలేను. వేటాడిన జంతువుల్లోంచి స్రవించే రక్తంతో తుడిచి వేయలేను - శయన మందిరంలో శరీర సుఖాన్నిచ్చే యే సుందరాంగి బాహు పాశంలోనూ కప్పి వేయలేను.

లేదు - యయాతికి సుఖం లేదు. యయాతి దుఃఖితుడే! నేను దుఃఖితుణ్ణా? సుఖ పడుతున్నానో, దుఃఖిస్తున్నానో నాకే తెలియదు - సుఖ మంటే యేమిటి? దుఃఖ మంటే యేమిటి? ఈ కఠిన ప్రశ్నకు ప్రపంచంలో జవాబే లేదు.

నా ముందర మద్యంతో నిండిన పాన పాత్ర వున్నది. మాధవుడు నన్ను విడిచి వెళ్ళినప్పటి నుంచి నా ఏకైక మిత్రం ఆపాన పాత్రే - అహోరాత్రాల అంతరం తెలియనీయని మిత్రమిది. హృదయ భారాన్ని తేలిక పరిచే మిత్ర మిది.''

ఈ లాగే సాగుతుంది యయాతి స్వగతం. ముకులిక ద్వారా పరిచితుడైన సాధువు మరెవ్వరో కాదు - మందారుడే - ఒకప్పటి తన సేవకుడు - అలకకూ తనకూ సంబంధం అంటగట్టి రాజ

మాత చేత అలకను చంపించిన మందారుడు - అతడు సాధువు వేషం వేసి ఒక తత్త్వ ప్రచారం ప్రారంభించాడు. ఆ తత్త్వాన్ని యయాతికే కాక అనేకులకు బోధించాడు. అతని మఠానికి వచ్చే భక్తుల్లో పండితు లున్నారు. పామరు లున్నారు. స్త్రీలున్నారు. పురుషు లున్నారు. పూజలూ, జపాలూ పైనపటారమే- లోలోన అందరూ ఆశించేది, ఆకాంక్షించేది శరీర సుఖమే. ఆ మఠంలో యయాతి కోసం మందారుడూ, ముకుళికా మద్యాన్నే కాక మదిరాక్షులను కూడా ఏర్పాటు చేస్తున్నారు. పద్దెనిమిదేళ్లు యయాతి ఈ లాటి భోగ విలాసాల్లోనే గడిపాడు. యదును దస్యులు బంధించుక పోయారని తెలిసింది. ''యదునే కాదు, దేవయానిని బంధించుకొని పోయినా నా కవసరం లేదు.'' అని చెప్పి పంపించాడు. యయాతి - అప్పటి అతని మనస్థితి అలాంటిది.

అశోక వనంలో యయాతి గడిపిన విశృంఖల జీవితాన్ని చాలా వివరంగా వర్ణించాడు ఖాండేకర్. కామ ప్రవృత్తి మనిషిని ఎంతటి పతనానికి చేరుస్తుందో అది చెప్పటమే అతని ఉద్దేశ్యం. ఆ వివరణ వల్ల కథా గమనానికెలాటి పుష్టి కలుగదు.

శుక్రాచార్యుడు వచ్చాడు. దేవయాని పద్దెనిమిది సంవత్సరాలు తానుభవించిన మనక్లేశాన్ని, తన భర్త సాగిస్తున్న ఉన్మత్త జీవనాన్ని గురించి చెప్పింది. కోపిష్ఠి ఋషి అప్పుడే కూతురును వెంటపెట్టుకొని అశోక వనానికి వెళ్లాడు. యయాతిని పిలిపించాడు. ''యయాతీ! నేను చెప్పిందంతా మరిచిపోయావు. నా కూతుర్ని చాలా కష్ట పెట్టావు. నేను వద్దన్నా ఆమె దాసి శర్మిష్ఠతో ప్రణయ సంబంధం పెట్టుకున్నావు. ఔనా?'' అని ప్రశ్నించాడు. భయకంపితుడైన యయాతి '' ఔను మహర్షీ! తప్పు చేశాను క్షమించండి.'' అని వేడుకున్నాడు ''నీ తప్పులన్నింటికి కారణం నీలోని కామ ప్రవృత్తి. నీ కామ ప్రవృత్తికి కారణం నీ యౌవనం. ఇక ముందు ఏ స్త్రీవైపు చూడకుండా చేస్తాను. వృద్ధుడివైపో'' అని శపించాడు. అప్పటికప్పుడు వృద్ధుడై పోయిన యయాతి వైపు చూడలేక దేవయాని '' ఇదేమి చేశారు నాన్నా!'' అని విలపించింది. యయాతి అతని పాదాలు పట్టుకొని మహర్షీ! నాలో ఇంకా కామ వాంఛ తీరలేదు. భోగలాలసత దూరం కాలేదు. నన్ను క్షమించి మీ శాపాన్ని ఉపసంహరించు కోండి.'' అని ప్రార్థించాడు. ''రాజా! విలుకాని విల్లు, మహర్షి శాపం మళ్లీ వెనుకకు తీసుకోవటం సాధ్యకానివి. ఎంతైనా నువ్వు నా ప్రియ పుత్రిక భర్తవు గనక శాపాంతం చెప్తున్నాను విను. నీ వంశజుడు, నీ రక్తం పంచుకున్నవాడు తన ఇష్ట పూర్వకంగా నీ వార్ధక్యాన్ని స్వీకరించి తన యవ్వనాన్ని నీకిస్తే నువ్వు మళ్లీ యవ్వనుడ వవుతావు. నీకు కామ భోగాలతో తృప్తి కలిగి నీ వార్ధక్యాన్ని నువ్వు గ్రహించ దలుచుకున్ననాడు నా పేరు స్మరించి మూడు సార్లు ''నా వార్ధక్యాన్ని నేను స్వీకరిస్తున్నాను'' అను. వెంటనే నీకు యవ్వనం దానం చేసిన వాడు మళ్లీ యవ్వనుడవుతాడు. ఆ క్షణమే నువ్వు మరణిస్తావు'' అన్నాడు శుక్రుడు. ''ఈ శాపాంతం శాపం కంటే ఇంకా ఘోరంగా వుంది నాన్నా!'' అని మళ్లీ విలపించింది దేవయాని. శుక్రాచార్యుడు రౌద్రాకారంతో లేచి నిలబడ్డాడు. ''దేవయానీ! తల్లిలేని పిల్లవని నిన్ను అల్లారు ముద్దుగా పెంచాను. నీ ప్రతి హఠాన్నీ తీర్చాను. దాని వలన నాకేమి లభించింది? అవమానము, పరాజయము. మీ సంసారాన్ని బాగు చేద్దామని వచ్చాను. ఇంకా చెడిపోయిందని యేడుస్తున్నావు. నా తపస్సిద్ధిలోనే ఏదో దోషమున్నది. ఆ దోషాన్ని నివారించు కోవటానికి మళ్లీ తపస్సుకు వెళుతున్నాను. మీ వార్ధక్య యవ్వనాలతో నాకు సంబంధం లేదు. మీరు సంసారం చేయండి లేదా చావండి. అంటూ చరచరా వెళ్లిపోయాడు. అంతలో దేవయాని దర్శనానికి యువరాజు తన

మిత్రులతో కలిసి వచ్చాడని వార్త వచ్చింది. ఇద్దరు యువకులు లోన ప్రవేశించారు. యదు తల్లికి పాదాభివందనం చేసి తన మిత్రుని పరిచయం చేశాడు. ఇదంతా చూస్తున్న యయాతికి దేవయాని మీద పగసాధించాలన్న కోరిక కలిగింది. యదు నుద్దేశించి యదూ! నన్ను గుర్తుపట్టావా?'' అని ప్రశ్నించాడు. గుర్తు పట్టినట్లు చెప్పాడు యదు. ''నేను శాపవశాన ముసలివాణ్ణి అయినాను. కాబట్టి రాజ్య భారం నీ మీద మోపా లనుకుంటున్నాను.'' అన్నాడు యయాతి. ''మహారాజు ఇష్టం'' అని మనవి చేశాడు యదు. ''కాని, నా వార్ధక్యాన్ని నువ్వు కొన్నాళ్లు స్వీకరించాలి.'' అని యయాతి అంటుండగానే దేవయాని అడ్డు తగిలి ''యదూ! మీ నాన్న గారికి మతి చలించింది. నువ్వేమీ వినవద్దు.''! అని యదు వెంట వచ్చిన అతని మిత్రుని వంక చూచి ''కుమారా! ఇది మా గృహ కలహం. పరాయి వాళ్ల ముందు జరుగ వలసింది కాదు. పద.'' అన్నది. '' నేను పరాయివాణ్ణి కానమ్మా! మీ వాణ్ణే'' అని ఆ యువకుడు చెప్పాడు.''నా కొడుకు ప్రాణాల్ని రక్షించిన నువ్వు పరాయివాడివి కావన్న మాట నిజమే. కాని ఇది మా ముగ్గురి మధ్య జరుగవలసిన వ్యవహారం.'' అన్నది దేవయాని. ఆ యువకుడు యయాతి వైపు చూస్తూ'' మహారాజా! యువరాజు స్వీకరించటానికి వెనుకాడుతున్న మీ వార్ధక్యాన్ని నేను సహర్షంగా స్వీకరిస్తాను.'' అని ముందుకు వచ్చాడు. దేవయానీయదూ ఆ యువకుని వైపు ఆశ్చర్యంగా చూస్తున్నారు. ''కుమారా! నా రక్తం పంచుకున్న వానికే ఆ అధికారం వున్నది. నువ్వెలా స్వీకరిస్తావు?'' ప్రశ్నించాడు యయాతి. అందుకా యువకుడు. ''మహారాజా! నా శరీరంలో ప్రవహిస్తున్నది మీ రక్తమే. రాజ కన్యగా జన్మించి దాసిగా బ్రతుకుతున్న శర్మిష్ఠకు మీ వలన కలిగిన పుత్రుణ్ణి నేను. నా పేరు పూరుడు.'' అని తన పరిచయం చేసుకున్నాడు. ''శర్మిష్ఠ కొడుకువా? పూరునివా? రాజ్యానికి వారసుడు నా కొడుకే - రాజ్య కాంక్షతో వచ్చావా? తీసుకో నీ తండ్రి వార్ధక్యం.'' అంటూ పరిహసించింది దేవయాని.

''నాకు రాజ్యం వద్దమ్మా! నా తండ్రి సుఖమే నా సుఖం.'' అన్నాడు పూరుడు. యయాతి తన కొడుకు శౌర్య పరాక్రమాల గురించి విన్నాడు. ఇప్పు డతని త్యాగ బుద్ధిని, పితృప్రేమను చూచాడు. ఆనందాశ్రువులు తుడుచుకుంటూ, ''మంచిది నాయనా!'' అన్నాడు. ఆ మాట అన్న వెంటనే పూరుడు ముసలివా డయ్యాడు. యయాతి పూర్వ రూపం పొందాడు. ఈ వింతను చూచిన దేవయాని యదు వెంట హడావిడిగా అక్కడి నుంచి వెళ్లిపోయింది.

పూరుని విజయ వార్తను విని శర్మిష్ఠ నగర ప్రవేశం చేసి అంతా తెలుసుకున్నది. అంతకు ముందే నగర ప్రవేశం చేసిన సువర్ణ కేశాల అలకను మందారుని భటులు యయాతి శయనా గారం చేర్చారు. లోనికి వెళ్లిన యయాతికి ఏడుస్తూ అలక కనిపించింది. తన కొడుకును ప్రేమించి వచ్చిం దామె - తాను ప్రేమించిన సువర్ణకేశాల అలకే, తాను సోదరిగా భావించిన అలకే ఆమె చెల్లెలి కూతురైపుట్టి తన కొడుకును ప్రేమిస్తున్నది. తన కోడలు కానున్నది. అటు వైపు ముసలి వాడైన కొడుకును పట్టుకొని శర్మిష్ఠ ఏడుస్తున్నది. తన కొడుకు పడుచు వాడైతే తన భర్త మరణిస్తాడు. ముసలి వాడైన తన కొడుకును చూస్తూ తాను బ్రతుక జాలదు. ఆమె దుఃఖానికి అంతు లేదు. యయాతి శర్మిష్ఠను ఓదార్చి లోపలికి పంపాడు. శుక్రాచార్యుణ్ణి స్మరించి, '' నా వార్ధ్యకం నేను స్వీకరిస్తున్నాను. నా వార్ధక్యం నేను స్వీకరిస్తున్నాను. నా వార్ధక్యం...'' అని యయాతి అంటూ వుండగానే రాజ భవనంలో '' కచదేవుడు వచ్చాడు- కచ దేవుడు వచ్చాడు.'' అనే కోలాహలం బయలు దేరింది. యయాతి స్పృహ తప్పి పడిపోయాడు. స్పృహ వచ్చిన తర్వాత

చూస్తే తన దగ్గర కచదేవు డున్నాడు. రాజ వైద్యు డున్నాడు. శర్మిష్ఠ వున్నది. దేవయాని వున్నది. తన వార్ధక్యం తనకు వచ్చింది కాని తాను చావలేదు. ఏదో రుగ్మత కలిగింది. కచుడు తన తపశ్శక్తి వలన శుక్రాచార్యుని శాపాన్ని తప్పించాడు. అనారోగ్యంతో పడివున్న దేవయానీ శర్మిష్ఠలు సేవ చేస్తున్నారు. వాళ్లలో ద్వేషం లేదు. దేవయానిలో అలాటి మార్పు ఎలా వచ్చిందో తెలుసుకోలేక పోయాడు యయాతి. దానికి కచుడే కారణం కావచ్చు ననుకున్నాడు. కాని కారణం పూరుడే అని తర్వాత కచుని ద్వారా తెలుసుకున్నాడు.

తన యౌవనం తనకు లభించగానే పూరుడు నేరుగా దేవయాని దగ్గరికి వెళ్లాడు. ఆమె పాదాలు పట్టుకొని '' ఆయీ! (అమ్మ) యదు పెద్దవాడు. రాజ్య మతనిదే - నాకు రాజ్యం వద్దు.'' అని చెప్పాడు. దేవయాని చలించి పోయింది. '' ఇంతటి పరాక్రమం, త్యాగబుద్ధి, ప్రేమ నీలో ఎలా కలిగాయిరా పూరూ! నీ లాటి నిర్వ్యాజమైన ప్రేమ నాకూ చిన్నప్పు డెవరైనా నేర్పివుంటే ఎంత బాగుండేది! నీ వలన నేర్చుకొంటానురా. రాజ్య మెవరిదో మహారాజు నిర్ణయిస్తాడు. ప్రజలు నిర్ణయిస్తారు. నాకు దానితో సంబంధం లేదు. ఇంతటి ప్రేమ మూర్తివి నన్ను ' ఆయీ!' అని పిలిచావు. ఈ పిలుపుతో నాకు సమస్త ప్రపంచ రాజ్యాధికారం దొరికిందిరా. నీ ప్రేమలో నాకు కొంత దానం చేయి. నా కది చాలు.'' అని లేవనెత్తి నుదురు చుంబించింది.

ప్రజాభీష్టం ప్రకారం యదు కాక పరాక్రమ వంతుడైన పూరుడే రాజ్యాధికారిగా నిర్ణయింప బడ్డాడు.

యయాతి అనారోగ్య వార్త విని యతి కూడా వచ్చాడు. ఆరోగ్యం కుదురుకున్న తర్వాత యయాతి యతితో '' అన్నా! నేను అకాల వార్ధక్యాన్ని పొందాను. ఇప్పటికైనా నీ రాజ్యం నువ్వు స్వీకరించు.'' అన్నాడు. ''యయాతీ! సింహాసనం మీద కూర్చునే కంటే మృగాజినం మీద కూర్చోవటంలో ఎంతటి ఆనంద మున్నదో అది నువ్వూ అనుభవించు.'' అని సలహా యిచ్చాడు యతి. అంటే వానప్రస్థం స్వీకరించుమని సలహాయిచ్చాడు. అంతా వనాలకు వెళ్లేటప్పుడు కచుడు '' మీ కోరికలు చెప్పండి.'' అని అడిగాడు. దేవయాని, శర్మిష్ఠ తమకే కోరికలు లేవన్నారు. ''రెండు కోరికలున్నాయి.'' అన్నాడు యయాతి. మాధవుని ముసలి తల్లిని తమ వెంట తీసుకెళ్లి ఆమెను సేవించుకోవాలన్నది ఒక కోరిక. తన కథ ప్రచారం పొందాలన్నది రెండవ కోరిక. ''తథాస్తు'' అన్నాడు కచుడు.

పట్టాభిషిక్తుడైన పూరుడు తండ్రి ఆశీస్సుల కోసం వచ్చాడు. కొడుకును నిండు మనసుతో ఆశీర్వదించి, ''కుమారా! పురుషార్థాల్లో కామము, ధర్మము ప్రబలమైనవి. ధర్మం చేతికి పగ్గాలిచ్చి కామాన్ని అదుపులో పెట్టుకో '' అని ఉపదేశించాడు.

న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణ వర్త్మేవ భూయ ఏ వాభివర్ధతే.

(నోటు: మహాభారతంలో తన వార్ధక్యం స్వీకరించని యదును శపించినట్లున్నది. ఖాండేకర్ ఆ సందర్భం తప్పించాడు. యయాతి పూరుని యౌవనాన్ని స్వీకరించి కావం సుఖాలనుభవించినట్లున్నది. ఖాండేకర్ కచుణ్ణి ప్రవేశపెట్టి వార్ధక్య యౌవనాల ఆదాన ప్రదానాలు కొన్ని గడియల్లోనే పూర్తి చేశాడు. ఈ రెండు మార్పులూ సమంజసమైనవే.)

# యయాతి ని గురించి

అశేష పాఠకుల మన్నన అందుకొని, జ్ఞానపీఠ, కేంద్ర సాహిత్య అకాడమీల బహుమతులందుకొన్ని 'యయాతి'ని గురించి సమీక్షాత్మక వ్యాసం ప్రచురించాలనే సంకల్పంతో, రచయిత విష్ణుసఖారామ్ ఖాండేకర్‌ను పరిచయం చేశాము.

సంవత్సరానికి ఒకటి చొప్పున 12 నవలలు (1930-1942) వ్రాసిన ఖాండేకర్, స్వాతంత్ర్యానంతరం మనదేశంలో దిగజారిపోతున్న నైతిక విలువలు, పెచ్చుమీరిపోతున్న భోగవాదం, సమాజం- వ్యక్తికి మధ్య ఉండవలసిన సంబంధాలలో సమతౌల్యం లోపించి పోవడంతో వ్యాకులత చెందాడు. అప్పు డతనికి మహాభారతంలోని 'యయాతి' కథ స్ఫురించింది. మనకు నరనరాలలో పౌరాణిక కథలు జీర్ణించుకుపోయాయి. అవే మనకు ఆదర్శా లయినాయి. ఆ కథల బాణీలో సమకాలీన సమాజంలోని అకృత్యాలను, భ్రష్టాచారాలను చిత్రిస్తే పాఠకులకు తొందరగా వంట బడుతుందనే ఆద్దేశ్యంతో, మహాభారత కథలోని ఒక ఉపాఖ్యానాన్ని ఈ కాలానికి సరిపోయే కథావస్తువుగా మలచుకొని, ఈ నవల వ్రాయటానికి 6 -7 సంవత్సరాలు పట్టింది.

అతి భోగవాదానికి ప్రతీకగా యయాతిని చిత్రించి, ఆత్మ కేంద్రితు డయిన (Self - centred) వ్యక్తి వలన ఆ వ్యక్తికీ, సమాజానికీ మేలు జరుగదు, వ్యక్తికీ, సమాజానికీ మధ్య సమతౌల్యం (balance) ఉన్నప్పుడే, ఆ వ్యక్తికీ, సమాజానికీ మేలు జరుగుతుందన్నదే 'యయాతి' నవల యొక్క సందేశమని, ఖాండేకర్ స్పష్టపరచాడు. భారతీయ సంస్కృతి సంయమనం, త్యాగం సుఖమయ జీవనానికి పునాదులని ఉగ్గడించింది. కేవలం తను, తన కుటుంబమే కాకుండా, సంఘం, జాతి, దేశం కూడా సుఖ పూర్ణంగా వర్ధిల్లాలనేది మానవుడి లక్ష్యం కావాలి. ఈ సమతౌల్య భావంతోనే ప్రజాతంత్రం, సమాజవాదం వికసిస్తాయి. లేకపోతే అధోగతి పాలవుతాయి.

యయాతి, దేవయాని, శర్మిష్ఠ కచుడు ఈ నాలుగు పాత్రల స్వగతంలా (త్మకథలా) నడిచిన, ఈ నవల ఆధునిక భారతీయ నవలారంగంలో తలమానికం లాంటిది అని చెప్పడంలో అతి శయోక్తి లేదు.

# దుస్తులు (డ్రెసెస్)

– పురాణం సుబ్రహ్మణ్య శర్మ

అప్పుడు పుట్టిన పిల్లలకి డ్రెస్సు లుండవు. ఈ డ్రెస్సు అనేది ఆచ్ఛాదనము. శీతోష్ణాల నుంచి కాపాడటానికి మనుషులకి డ్రెస్సులు అవసరం. బట్టలు కుట్టేవాళ్ళు తొడుక్కునేవాళ్ళు తెలిపినట్లు, బట్టలు తయారు చేసేవారు మనకు అట్టే తెలియదు. ఎన్ని రకాల డ్రెస్సులు వచ్చినా చీరకు సాటిరావు, అంద మంతా చీరలోనే వున్నదీ అన్నట్లు చీర అందం చీరదే! వస్త్రాలు అభివృద్ధి చెంది డ్రెస్సులుగా మారాయనిపిస్తుంది. రెడీమేడ్ షాపులంటూ వెలిశాక డ్రెస్సులలో ఆడ, మగా కాక అన్ని వయసుల వారికీ కావలసినట్లు ఏర్పాడ్డాయి.

చీరలు, రవికలు గాకుండా మిగతా వన్నీ దుస్తులు, అనగా డ్రెసెస్ వివరణలోకి వస్తాయి. పశ్చిమ దేశవాసుల సంసర్కంతో తురకల రాజ్యంలో మనకు వచ్చినవి గౌనులు, చొక్కాలు, లాగులు, చెడ్డీలు, పైజమ్మాలు, జుబ్బాలు వగైరా. పూర్వం మన దేశ వాసులు అంతా పంచెలు, ఉత్తరీయాలు ధరించే వారు. చొక్కా అనేది తరువాత వచ్చింది. భమిడి పాటి కామేశ్వరరావుగారి జోక్సులలో చొక్కాకు సంబంధించినది ఓటి వుంది. ఒక పల్లెటూరి వాడు ఒక చొక్కా తోడుక్కున్న వానిని చూసి ''యిదే విటిరా యిందులో యిరుక్కుపోయావు, ఎట్లా బయట పడతా'' వని వాపోతాడు, భమిడిపాటి వారి మరో నాటకంలో అనగా 'బాగుబాలాగు' లో ఒక ఆసామీ కోటు తిరగేసి తొడుక్కొని ఒక నాటక ప్రదర్శనకు వెళ్తాడు. అక్కడ అతన్ని బాగు బాగు అని అంతా యాగీచేస్తారు. పేంటలూన్ అనే ఇంగ్లీషు మాటకు పంట్లాం తెలుగు సేత. 'పేంట్' అని యిప్పుడు అంటున్నారు. కోట్ అని మనం అంటున్నది నిజంగా జాకెట్. జాకెట్ అన్న మాట తెలుగులో స్త్రీలు ధరించే రవిక వంటిది. పాశ్చాత్యులంతా జాకెట్ అనేది కోటు వంటిది. కోటు అక్కడ వాడకంలో లేదు.

స్త్రీల దుస్తులలో వచ్చినంత మార్పులు అంత వేగంగా పురుషుల దుస్తులలో రావు. స్త్రీలకు అందం ఆకర్షణల మీద మోజు హెచ్చు. నిన్న మొన్నటి దాకా కుర్రాళ్ళు చిన్న వారుగా నిక్కర్లు వేసుకు వచ్చేవారు. పూర్వం తొడ లాగులు అని వుండేవి. ఆడ పిల్లలు చిన్న వారుగా వీటిని ధరించేవారు. కుట్టు మిషను రాక పూర్వం అన్నీ చేత్తో కుట్టుకునేవారు. కుట్టు మిషను దర్జీ వృత్తిని ప్రోత్సహించింది. దర్జీకి టేపు, కత్తిర అవసరాలు. పూర్వం యింటి వీధి అరుగుల మీద టైలరు షాపులు వుండేవి. బట్టలు దుకాణాలకి ఒక టైలరు అనుబంధంగా వుండేవాడు. పండగలకు టైముకు కుట్టి యివ్వక పిల్లలను తమ చుట్టూ త్రిప్పు కునేవారు టైలర్లు. ఆడ పిల్లలు టైలరు షాపులకు వెళ్ళి కత్తిరించిన గుడ్డ పేలికలను పోగుచేసి బొమ్మలకు దుస్తులు కుట్టేవారు. గౌనుల తర్వాత పిల్లలు పరికిణీలు, జుబ్బాలు తోడుక్కునేవారు. పంట్లా మును తెలుగులో పొడుగు లాగు అని పిలిచేవారు. పెద్ద వారు లాల్చీలను పంచెలపై ధరిస్తారు ఇప్పటికీ. పొడుగు చేతుల చొక్కాలని ఫుల్‌హేండ్స్ షర్ట్సును తెలుగులో అనేవారు. నిక్కర్లని పొట్టి లాగు అని రిఫర్ చేసేవారు.

ఇప్పటి కాలంలో పంజాబీ డ్రెస్సులని చూడీదార్ పైజమ్మాలు వచ్చాయి. ఆడ పిల్లలు స్టూడెంట్లకు యివి చక్కగా వుంటాయి. ఇప్పుడిప్పుడు జీన్ పాంట్లు, మగవారి షర్టులు యూని డ్రెసెస్ అని వుభయులూ ధరిస్తున్నారు. పూర్వం మడత నలగని దుస్తులు శుభ్రంగా ధరించి నీటుగా వుండటం ఫ్యాషన్. ఇప్పుడో - అలాక్కాదు. ఎంత రఫ్గా వున్నట్లు కనిపిస్తే అంత గొప్ప. మగవారికి హీరో అయినా, విలన్ అయినా గడ్డం వుండాలి. చాలా తాజాగా వుండాలి. జీన్ పాంట్ ఎంత మాస్తే, మరకలుగా వుంటే అంత గొప్ప. ఒకప్పుడు టైట్గా వుండే దుస్తులు ఫ్యాషన్. ఇప్పుడు ఎంత వదులుగా బ్యాగీలుగా వుంటే అంత మోడ్రన్. చాలా కాలం గొట్టాం ప్యాంట్లు ఫ్యాషన్గా రాజ్యమేలాయి. తరువాత వదులు ప్యాంట్లు వచ్చాయి. మళ్లీ యిప్పుడు ప్యాంటు చివర్లు మడతలు ఫ్యాషన్గా వచ్చాయి. చివర సన్నం మధ్యన వదులు పైన బిగుతు వుండటం ఆచారం. నైటు డ్రెస్సులని చారల పై జామాలు, చారల షర్ట్ వచ్చాయి. ఏ రోజుకా రోజు ఉతికిన బట్టలు ఆరోజు తొడక్కోవడం రివాజు. నెత్తి మీద, పాగా స్టేటస్ సింబల్. గురుజాడ అప్పారావుగారు, వీరేశలింగం గారు, చాలామంది పెద్ద వారు పాగాలు ధరించేవారు. పోలీస్ ఉద్యోగులు హేటు, బూటు, సాక్స, ధరించేవారు. ఇంగ్లీషు వారిని అనుకరించి మన ఉద్యోగులు సూట్లు హేట్లు బూట్లు ధరించేవారు. బంట్రోతులకు ఏటవాలుగా డవాలీ బెల్టు వుండేది. మావయాలు మనుషులు చెప్పులు వేసుకునేవారు. బుజం మీద కండువా లేకుండా వీధిలోకి ఎవరూ వచ్చే వారు కాదు. ఎవరి దేనా ఉత్తరీయం లాక్కుంటే అమర్యాద, అవమానం, పరువునష్టం.

రవికలను చోళీలంటారు. చోళీ,చేతులు పొడుగుగా వుండటం, చిన్నవి కావడం కాలానుగుణంగా పైకీ, కిందకీ జరిగే ఫ్యాషన్లు. ఆంగ్లో - ఇండియనులు, యూరోపియన్ వనితలు గౌనులు రకరకాలవి ధరించేవారు. ఇప్పుడు మనవారు సైతం, టై, చో ధరిస్తున్నారు. పూర్వం పెళ్లి ఫోటోలలో పైన సూటు, పంచెలో చొక్కా దోపి టకప్, కాళ్ళకు పారాణి పసుపు రాసుకుని దిగేవారు. పెళ్ళిలో పండగలలో పెళ్ళి కొడుక్కి సూటు కుట్టించడం ఆచారం అయిపోయింది. రాజ కపూర్ 420 అనే చిత్రంలో 'మేరాజూతా హైజపానీ' అని ప్రారంభించి, సూటూ బూటూ వర్ణించి చివరల్లో 'ఫిర్ భీ' దిల్హై హిందుస్థానీ అని ముగిస్తాడు. చిత్రాలలో పత్రికలలో కొందరి స్త్రీలకు దుస్తులు అనవసరం, అవసరమా అనే స్థాయికి వారి ప్రదర్శనలు మారుతున్నాయి. ముఖ్యంగా క్లబ్బు డాన్సులలో ఆడదానికి వస్త్రం వున్న స్పృహే వుండదు. మగవాడు మాత్రం పూర్తి ఆచ్ఛాదనలో దొరబాబులా ఎగురుతూ స్టెప్స్ వేస్తూ డ్రెస్సులు లేకుండా నటించాలి. ఇంకొక చిత్రం ఏమనగా పాటలో చీర అనీ పైటగాలి అని వుంటుంది - పాత్ర బికి నీలోనో మరో డ్రెస్సులోనో హీరోయిన్ వుంటుంది. పారిస్లో ఒక మొగుడుగారు ఒక డ్రెస్ పుచ్చుకుని పరిగెత్తు తూకుంటాడు. ఇది ఆవిడ గారు ధరించేలోగా ఫ్యాషన్ మారిపోతుందేమో నని అతగాడు కంగారు పడుతూవుంటాడు ఫ్యాషనులు పాత బడి డ్రెస్సులు మూల బడడం ఒక అవస్థ. ఫ్యాషన్లు మారాక పాత దుస్తులు ధరించే వారిని కాలం చెల్లిన మనుషులుగా కాస్త హేళనగా చూసేవారు. పాత సోషల్ సినిమాలలో నాగయ్య గారు పంచె, చొక్కా పైన కోటు తొడుక్కుని హీరోగా చెలామణీ అయేవారు. సూట్లు ధరించడం మానేసి యిప్పటి హీరోలు వికృతంగా దుస్తులు ధరించి మనుషులకు వర్తించే నియమాలు తమకు వర్తించ వన్నట్లు అతీత వ్యక్తులుగా ప్రవరిస్తున్నారు.

''తల మాసిన యిలు మాసిన నలువలు మాసినను ప్రాణ వల్లభునైనన్ కులకాంత లైన రోయిదురు'' అన్నాడు సుమతీ కతక కారుడు. మనిషి శుభ్రంగా నిండుగా డ్రెస్ చేసుకోవాలి. అది తప్పని సరి. పోస్టుమేన్, సోల్జర్, ఆర్మీ, నేవీ, పోలీసు, సి. ఆర్.సి. వారికి యూనిఫారాలు తప్పని సరి. వీరిని డ్రెస్సులు తీసేస్తే ఎవరూ పోల్చుకోలేరు.

సమాజ నియమాలకు, కట్టు బాట్లకు ఎవరూ అతీతులు కారు. అలా వ్యవహరించి నట్లయితే వ్యవస్థ నడవదు. పిచ్చి వాళ్ళు దుస్తుల్ని చింపుకుంటారు. ప్రతాప రుద్రీయం నాటకంలో చాకలి పేరిగాడు ప్రతాప రుద్రుడి డ్రెస్సులో వుంటాడు. 'ఢీల్లీ సుల్తాన్ పట్టుక పోతాన్ ' అని కేకలు వేస్తూ నదిలో సుల్తాన్ ఓడను ఎక్కుతాడు. పైట అని మనవారు ధరించేది మనకు పైఠాను అనే మహారాష్ట్రంలోని ప్రదేశం నుంచి వచ్చింది. పూర్వం తెలుగు స్త్రీలు 'పైట' అనేది ఎరగరు. మన పూర్వులు ఆటవికులు, మనవన్నీ ఆటవిక సంప్రదాయాలే. ఈ మధ్య జంటిల్మన్ అనే పత్రిక మగవారి ఫ్యాషన్లలో కూడా అనూహ్యమైన మార్పులు వస్తున్నాయి అంది. షర్టులు మునుపట్లా కాకుండా వదులుగా కొత్త రకం డిజైనులతో తయారవుతున్నాయి. డ్రెస్సులకు మోడల్సుగా కనిపించే మగవారు డ్రెస్సులలో ధనిక సామ్యాన్ని అనుకరిస్తూ వున్నారు. సర్వేజనాః కాంచన మాశ్రయంతి అన్నట్లుగా అంతా శ్రీమంతులను ఫాలో అయే వారే. కాంగ్రేసు వారికీ దేశ భక్తులకు అందరికీ ఖద్దరు వస్త్రధారణ కంపల్సరీ. తెలుగు దేశం వారు పసుపు పచ్చ డ్రెస్ ధరించి ఊరేగుతున్నారనుకోండి. చంద్రబాబు నాయుడు డ్రెస్సు చాలా సాధారణంగా ఒక స్టూడెంటు డ్రెస్సులా వుంటుంది. ఒకప్పుడు నెహ్రూ గారు ఢిల్లీలోని బ్యూరోక్రాట్లకు బటన్డ్ అప్ కోటు పాంటు నిర్ధారించారు. రాధాకృష్ణ గారు పంచె లాంగ్ కోటు తలపాగా ధరించేవారు. నెహ్రూగారి డ్రెస్సు అందరికీ ఎరికే. గూండాలు, రౌడీలు, హంతకులకు యూనిఫారా లుండవు. డ్రెస్సులు అవక తవకలుగా ధరించి పూర్వం హాస్యం పుట్టించేవారు. బుడ బుక్కల వాడి యూనిఫాం ఎల రెరిగినదే. అక్కజంగా ఎవడైనా డ్రెస్సు వేసుకుంటే బుడబుక్కల వాడిలా ఏవిటి ఆడ్రెస్సు అని వెక్కిరించేవారు. భర్త డ్రెస్సులు కొన్ని స్త్రీలు సామాన్ల వాడికి యిచ్చి ఆ గిన్నెలో గరిటలో చెమ్చాలో ఊరికే వచ్చినట్లు ఆనందిస్తూ వుంటారు వనితలు. స్కూళ్లకు వెళ్లే పిల్లలకు యూనిఫారాలను ప్రవేశపెట్టింది నెహ్రూ గారే. హోటళ్ళలో బేరర్లకు యూనిఫారా లుంటాయి. గుళ్ళో పూజార్లు ప్యాంట్లు షర్టులు ధరించి మనకు శఠగోపం పెట్ట కూడదు. పూజారి పంచె కండువా జంధ్యం ధరించి బొట్టుతో దేవుని ప్రతినిధిలా వుండాలి. చర్చిల్లో వుండే మఠాధి కార్లకు వేరే డ్రెస్సులు వుంటాయి. ఎవరి డ్రెస్సయినా రజకుడు అనగా చాకలి ఇస్త్రీ చేయకపోతే ఏడ్చినట్లు వుంటుంది. చాకలి మైల బట్టలను శుభ్రంగా వుతికి ఆరవేసి మడత పెట్ట ఇస్త్రీ చేసినట్లు 'బుద్ధి చెప్పిన వాడు గుద్దినవేమయా?' అన్నాడు కనుక, డ్రెస్సులు లేక పోతే కొందరు, వుంటే కొందరు బావుంటారు. టీ.వీ. లో సగం ప్రకటనలు మాసిన బట్టలు తెలుపు చేయడం ధగధగ మెరిసేలా చేయడం గురించే. ఇది వరకు బయట వుండే చాకిరీ అదనపు తద్దినం ఇల్లాలి నెత్తిమీద పౌడర్లు, సబ్బుల కంపెనీలు ఎక్కిస్తున్నాయన్న మాట! చాకి వానితోడ జగడాలు పడలేక సిరిగలాడు పట్టు చీర కట్టె, శివుడు పాలవై సేయని మదిరోసి' అన్నాడు కావున. లాండరీ ప్రాబ్లం డ్రెస్సుల గురించి దేవుళ్ళకు కూడా తగులు కున్నట్లుంది. ఎవరి పిచ్చి వారి కానందం అన్నట్లు ఎవరి డ్రెస్సు వారి కానందం!

# సాహిత్యంలో విలువలు

- బొమ్మ కంటి శ్రీనివాసాచార్యులు

ఎవడికి తెలుసిది? ఎవడు చెప్పగలడు?
ఎక్కణ్ణించి వచ్చింది? ఎక్కణ్ణించి ఈ సృష్టి?
సృష్టి పుట్టిన తర్వాతనే గదా దేవతలు పుట్టింది!
ఎవడికి తెలుసు - మరి ఎక్కణ్ణించి వచ్చిందో?

ఈ సృష్టి అంతా ఎక్కణ్ణించి వచ్చింది?
అతగాడు దీన్ని సృష్టించాడా? ఒకవేళ లేదా?
పరమాకాశంలో ఉన్న దీని అధ్యక్షుడు
అతగాడికి తెలుసేమో? లేక అతడికీ తెలీదో!!)

ఎలాంటి నమ్మకాలూ, భ్రాంతులూలేని నిసర్గమైన, ప్రాకృతమైన మనస్సు సృష్టి జరగడానికి ముందున్న స్థితిని గురించి చేసిన ఆలోచనా పరంపర ఇది. అయితే - స్తిమితంగా ఈజీ చేర్లో కూచుని తత్త్వవేత్త సాగించే శుష్కశాస్త్ర చర్చ వంటిది కాదిది. ఆవేదనతో, ఉద్వేగంతో అంతశ్చక్షువు విప్పి తెలియరాని రహస్యం తెలుసుకోవాలనే మథన ఈ సూక్తంలో ప్రతిమాటలోను కనిపిస్తుంది. అందుకే ఇది కావ్యం. 'హృది ప్రతీష్యా కవయో మనీషా' అనే పాదంలో 'యతయః' అనో, 'వ్రతినః' అనో అనకుండా 'కవయః' అనడం గమనించదగింది.

ఇలాంటి ఉత్తమ కావ్య ఖండికలు ఉపనిషత్తులలో అడు గడుగునా కనిపిస్తాయి.

'ద్వా సువర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే!
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్న న్నన్యోఽభిచాకశీతి॥ (ముండక. 3-1-1)

(రెండు పిట్టలు - ఎప్పుడూ విడిపోకుండా కలిసి ఉండే నేస్తాలు
ఒకే వృక్షాన్ని ఆశ్రయించుకుని ఉంటాయి
ఒకటి రుచ్యమైన ఆ పిప్పల ఫలాన్ని తింటుంది
మరొకటి ఏమీ తినకుండానే తేజస్సుతో మెరిసిపోతూ ఉంటుంది)

అనుపశ్య యథాపూర్వే ప్రతిపశ్య తథాపరే!
సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమి వాజాయతే పునః॥ (కాఠక. 1-1-6)

(గతించిపోయిన వారి సంగతి చూడు - ఇప్పు డున్నవారి సంగతి చూడు
సస్యంలాగ పండిపోతాడు మనుష్యుడు - సస్యంలాగ తిరిగి అంకురిస్తాడు

' ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు!
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవ చ॥ (కాఠక. 1-3-3)

(నీ ఆత్మ రథికుడు, శరీరమే రథం
నీ బుద్ధి సారథి, మనస్సే పగ్గం.)

'ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్ని బోధత।
క్షురస్య ధారా నిశితా దురత్యయా
దుర్గం పథస్త త్కవయో వదన్తి॥ (కాఠక. 1-3-14)

(లేవండి! మేలుకోండి!!
సాధించదగ్గ వరా లేవో తెల్చుకోండి!!!
కత్తి వాదర లాంటిది సాధన మార్గం - అత్యంత దుర్గమం - అంటారు కవులు)

'న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం
నేమా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః।
త మేవ భాన్త మనుభాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి॥ (కాఠక, 2-2-15)

(అక్కడ సూర్యుడు వెలగడు, చంద్రుడూ, నక్షత్రాలూ కనపడవు; మెరుపులు లేవు, అగ్ని లేదు; ప్రకాశించే అతడినుంచే సర్వం ప్రకాశిస్తుంది; అతగాడి వెలుగువల్లనే సర్వం వెలుగుతుంది.)

' ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథాః మాగృథః కస్య స్విద్ధనమ్॥ . (ఈశావాస్య:1)
('జగత్తులో సర్వం ఈశ్వరుడిచేత కప్పబడి ఉంది'
అనే త్యాగభావంతో జీవించు - పరుడి ఆస్తి ఆశించకు)

ఈ వైదిక కవిత్వం సార్వజనీనం కావడం వల్లనే భారతీయేతరులను అది ఎక్కువగా ఆకర్షించ గలుగుతూంది, ప్రభావితం చేయగలుగుతూంది. మానవ మేధా, ఆత్మా నిర్నిరోధంగా వికసించడానికి వేదకాలంలో ఉన్న అవకాశాలు క్రమంగా లుప్తమై రామాయణ కాలంనాటికి భారతీయ సంఘం వర్ణాశ్రమ వ్యవస్థ అనే చట్రంలో బిగిసిపోయింది. స్మృతులు వెలసి ఎవరు ఎలా ఆలోచించాలో, ఎలా వర్తించాలో కఠినంగా శాసించడం జరిగింది. అప్పటి నుంచే భారతీయ సంఘం సంవృతం (Closed) కావడం, నిర్దిష్ట సంఘ ధర్మ ప్రచారమే సాహిత్యంలో ప్రధానమైన విలువ కావడం సంభవించింది. జ్ఞానానికి ప్రాధాన్యం పోయి, కర్మ ప్రాధాన్యం హెచ్చడంతో వర్ణాశ్రమానుగుణ కర్మలను ఉపదేశించడమే సాహిత్య ధ్యేయ మైంది. మానవుణ్ణీ, అతని సమస్యల్నీ యథాతథంగా నిరూపించడానికికాక, పరిపూర్ణ మానవుణ్ణి ఊహించి అతని వర్తననూ, ధర్మాలనూ ప్రపంచించడానికి పూనుకుంది అది కావ్యం అయిన రామాయణం. ఉదాహరణకు ఈ క్రింది వాక్యాలు చూడండి:

'తవ లక్ష్మణ! జానామి మయి స్నేహ మనుత్తమమ్
విక్రమం చైవ సత్త్వం చ తేజశ్చ సుదురాసదమ్
మమ మాతు ర్మహద్దుఃఖ మతులం శుభలక్షణ!
అభిప్రాయం న విజ్ఞాయ సత్యస్య చ శమస్య చ
ధర్మోహి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్
ధర్మసంశ్రిత మప్యేతత్ పితుర్వచన ముత్తమమ్
సంశ్రుత్య చ పితుర్వాక్యం మాతు ర్వా బ్రాహ్మణస్య వా
న కర్తవ్యం వృథా వీర! ధర్మ మాశ్రిత్య తిష్ఠతా
సోఽహం న శక్ష్యామి పున ర్నియోగ మతివర్తితుమ్
పితుర్హి వచనా ద్వీర! కైకేయ్యాహం ప్రచోదితః
తదేతాం విసృజానార్యాం క్షత్రధర్మాశ్రితాం మతిమ్
ధర్మ మాశ్రయ మా తైక్ష్ణ్యం మద్బుద్ధి రనుగమ్యతామ్ (అయో. 21 వ సర్గ. 39-44)

రాముణ్ణి అడవికి పంపి భరతుడికి రాజ్యం ఇవ్వాలని కైకేయి అన్న మాటకు లక్ష్మణుడు మండి పడతాడు. 'కాస్య శక్తిః శ్రియం దాతుం భరతా యారి శాసన!' (భరతుడికి రాజ్య దానం చేసే ఆ తాహత్తు ఎవరికుంది?) అని గర్జిస్తాడు. త మ్ముణ్ణి అనునయిస్తూ శ్రీరాముడు అంటున్న మాట లివి: ''నాయనా! నీ శక్తి నాకు తెలుసు. సత్య శమాల అభిప్రాయం తెలియని నా తల్లి దుఃఖం ఎంత తీవ్రమైందో అది నాకు తెలుసు, ధర్మమే లోకంలో పరమ మైంది. దర్మంలోనే సత్యం ప్రతిష్ఠితమైంది. ధర్మ సంశ్రితమైన పితృవాక్యం ఉత్తమమైంది. తండ్రి మాట, తల్లిమాట, బ్రాహ్మణుని మాట విని కూడా దానిని వ్యర్థం చేయరాదు- ధర్మపరుడైన వ్యక్తి. నేను ధర్మపరుణ్ణి గనుక పితృనియోగాన్ని ఉల్లంఘించే శక్తి నాకు లేదు. తండ్రి మాటవల్లనే కైకేయి నన్ను ఈ విధంగా కోరింది. అందుచేత క్షత్రధర్మాశ్రితమైన, అనార్యమయిన నీ బుద్ధి మార్చుకో! తైక్ష్ణ్యం మాను, ధర్మాన్ని ఆశ్రయించి నా బుద్ధి ననుసరించు.''

పితృవాక్య పరిపాలన వంటివి సంఘశ్రేయస్సును గోరి ఒకానొక సంఘంలోని పెద్దలు నిర్దేశించిన ధర్మాలు. అవి సర్వ సంఘ సమానాలు అనడానికి వీలు లేదు. అందుచేత - సాంఘిక ధర్మ సమర్థకాలైన రామాయణం వంటి కావ్యాలు ఆ ప్రత్యేక సంఘానికే - అదీ ఆ సంఘం మారకుండా ఉన్నంతవరకే - అర్థ వంతాలుకాగలుగుతాయి.

లౌకిక సంస్కృతంలో సంఘ ధర్మ ప్రబోధానికి కాకుండా మానవునిలోని సహజమైన విలువలకు ప్రాధాన్యం ఇచ్చిన రచన భారతం ఒక్కటి కనిపిస్తుంది. మానవులలోని దివ్యాంశతో పాటు అతని బలహీనతలనూ, లోపాలనూ కూడా యధాతథంగా చిత్రించడానికి భారతం పూనుకుంది. భారతంలోని భగవద్గీతలోనూ, ఇతర ఉపదేశక ఘట్టాల లోనూ ఉపనిషద్వాక్యాల ప్రతి ధ్వనులు వినిపిస్తాయి. ఆ దృష్ట్యా భారతం నిస్సందేహంగా పంచమ వేదమే! 'ఇవి కేవల ధర్మాలు, ఇవి కేవల అధర్మాలు' అని రామాయణంలో లాగ కచ్చితంగా శాసించడానికి పూను కోకుండా కర్తవ్యాకర్తవ్యాల విషయంలో మానవుణ్ణి అడుగడుగునా వేధించే జిజ్ఞాస యథాతథంగా భారతంలో ప్రతిపాదితమైంది. సౌప్తిక పర్యంలో ఈ ఘట్టం చూడండి:

నిద్రా సమయంలో పాండవుల శిబిరం మీద పడి చిత్రవధ చేయడమే అప్పటి తమ కర్తవ్యమని కృపాచార్యునికీ, కృత వర్మకూ నచ్చజెప్పే ప్రయత్నంలో అశ్వత్థామ మానవ మనస్తత్వాన్ని గూర్చిన కొన్ని నిత్య సత్యాలు ఇలా ఉపన్యసిస్తాడు:

'దహ్యమాన స్తు శోకేన ప్రదీప్తే నాగ్ని నా యథా
క్రూరం మన స్తతః కృత్వా తా వుభౌ ప్రత్యభాషత
పురుషే పురుషే బుద్ధి ర్యా యా భవతి శోభనా
తుష్యన్తిచ పృథక్ సర్వే ప్రజ్ఞయా తే స్వయా స్వయా
సర్వో హి మన్యతే లోక ఆత్మానం బుద్ధిమత్తరం
... ... ... ...
పర బుద్ధించ నిందన్తి స్వాం ప్రశంసంతి చాసకృత్
... ... ... ...
అన్యయా యౌవనే మర్త్యో బుద్ధ్యా భవతి మోహితః
మధ్యేఽన్యయా జరాయాం తు సోఽన్యాం రోచయతే మతిం
వ్యసనం వా మహా ఘోరం సమృద్ధిం చాపి తాదృశీం
అవాప్య పురుషో భోజ! కురుతే బుద్ధి వైకృతం
... ... ... ...
సర్వో హి పురుషో భోజ! సాధ్వేత దితి నిశ్చితః
కర్తు మారభతే ప్రీతో మరణాదిషు కర్మను

ఉపజాతా వ్యసనజా యేయ మద్య మతి ర్మమ
యువయోస్తాం ప్రవక్ష్యామి మమ శోక వినాశినీం

(భార.సౌప్తిక, 3-2-17)

('.... శోక దందహ్యమానమానసుం డగుచు నగ్గురు పుత్రుండు కృత వర్మను నతని నాలోకించి,

వెర విట్టి తెఱ గిది వెంగలితన మని యెల్లవాడును దన యెఱిఁగినట్టి
తెఱఁగున నిజకార్యదృష్టియ కయికొను నొరుల నేర్పులు పట్ట నొల్లఁ డాత్మ
బుద్ధియ మే లని పొగడు నన్యుల చిత్త వృత్తుల నిందించు వివిధ గతులఁ
జెందెడు నాత్మీయ చేతః ప్రవర్తన మతయఁడు దాన బాల్యమునఁ దలఁచు

తలఁపు గీడు చేసి యెలప్రాయమున నొండు, తలఁపునందుఁ బట్టుకొలుపుఁ బ్రీతి
ముదిమి వచ్చినతఱి నదియును విడిచి య, న్యంబు లైననేర్పు లాచరించు.
ఆపదఁ బడి యొక్కఁడు స, ద్వ్యాపారము గాఁగఁ జూచి దాని నడపు శ్రీ
ప్రాపించి నరుఁ డొండొక, చూపున వర్తించునది విశుద్ధ పదముగన్.
తగు నని మరణాదులకై, తెగువదెసన్ మానవుండు దృఢనిశ్చయతం
దగిలినయది పరమహితం, బుగ వదలక నడుపు నన్య బుద్ధులు గొనమిన్

మీ రెఱుంగనియది లేదు నాకుం దోచిన కర్జంబు మన కందఱకును శోకనాశనం బగునట్టిది దాని వినుఁడు...')

(ఆంధ్ర మహాభారతం - సౌప్తిక, 1,44-48)

ఉపదేశాలను ఈ చెవిన విని ఆ చెవిన విడిచి పెడుతూ ' ఆత్మబుద్ధి స్సుఖం చైవ' అనే భావంతో తన బుద్ధి ననుసరించే ప్రతి వ్యక్తీ వర్తిస్తూ ఉండడం, ఆ స్వబుద్ధి కూడా వయోభేదంతో మార్పు చెందుతూ ఉండడం, ఒకే వర్తన భిన్న భిన్న ఫలితాల వల్ల ఒకడికి మంచిది గాను, మరొకడికి చెడ్డదిగాను భాసిస్తూ ఉండడం - ఇలాంటి వాస్తవిక మనస్తత్త్వ రహస్యాలతో కూడిన మానవ జీవన దర్శనం - దేశ కాలాబాధితమైన మానవ దర్శనం - భారతంలో మనకు కనిపిస్తుంది.

భారతీయ సాహిత్యంలో విలువల దృష్ట్యా రెండు విభిన్న దృక్పథాలను గుర్తించాము. ఒకటి: సర్వ మానవ సహజమైన, స్వతస్సిద్ధమైన విలువలతో కూడిన 'ఉపనిషద్ - భారత' దృష్టి, రెండు: సంఘ ధర్మ ప్రబోధానికి మిక్కిలి విలువ నిచ్చే రామాయణ దృష్టి. ఈ రెండు దృక్పథాలే కాక భారతీయ సాహిత్యంలో అనంతర కాలంలో మరొక ప్రధాన ప్రస్థానం కూడా - విపులప్రచారం పొందినది - మనకు కనిపిస్తూంది. అది భాగవత దృష్టి: భక్తి ప్రధానమైనది. అటు మానవ జీవన వాస్తవికతా జిజ్ఞాసతో కూడిన జ్ఞాన మార్గానికీ, ఇటు - సంఘ సుస్థితిని సాధించెందుకు ఒక నిర్దిష్ట ప్రణాళికానుసారంగా కర్తవ్యా కర్తవ్యాలను ఉపదేశించే కర్మ మార్గానికీ కూడా స్వస్తి చెప్పిన ఈ భక్తి కొన్ని శతాబ్దాలుగా భారతీయ సాహిత్యాలను శాసిస్తున్నది. ఐహిక జీవితం నుంచి ఒక విధమయిన పలాయనాన్ని ఉపదేశిస్తూ, ఆత్మానంద సిద్ధికోసం నిర్వ్యాపారిత్వాన్నీ, భగవత్ శరణాగతినీ ఉపదేశించే ఈ భక్తి మార్గమే ఉత్తరాదిని తులసీదాస్, కబీర్ దాస్, సూర్‌దాస్, విద్యాపతి, చైతన్యుడు, జ్ఞానేశ్వర్, నరసీ భగత్ మొదలైన కవులకూ, దక్షిణాదిని అళ్వార్లూ, నాయనార్లూ, పోతన, పురందరదాసు, గోపన్న, త్యాగరాజు, అన్నమాచార్యులు మొదలైనవారికీ ఆలంబనమై భారతీయ సాహిత్యంలో ప్రధానమైన విలువలలో ఒకటిగా గౌరవం సాధించింది.

19వ శతాబ్దంలో పాశ్చాత్య సాహిత్యాల విలువలతో మనకు సంపర్కం ఏర్పడే వరకూ భారతీయ సాహిత్యాలలో కనిపిస్తూ వచ్చిన ప్రధానమైన విలువల స్థూల వివరణ మాత్రమే ఇది. కేవలం గుణ బాహుళ్యం దృష్ట్యా చేసిన విభాగమే అవడం వల్ల వేదంలోనూ, భారతంలోనూ సంఘ ధర్మ ప్రబోధమూ, భక్తి భావమూ గాని, రామాయణంలో తాత్త్విక దృష్టీ, భక్తి రచనా గాని, అలాగే భాగవతంలో సంఘ ధర్మ బోధా, తాత్త్విక వివరణా గాని క్వాచిత్కంగా కూడా కనిపించవని అర్థం చేసుకో కూడదు. అదిలో ప్రచురంగా ఉన్న తాత్త్వికమైన 'ఉపనిషద్ - భారత' దృష్టి క్రమంగా లుప్తమై, నీతి బోధకూ, భక్తికీ పట్టం గట్టిన రామాయణ, భాగవత దృక్పథాలు విపుల ప్రచారం పొందడంతో భారతీయ సాహిత్యాలు చాలా వరకు సత్యాంశ దూరాలూ, సుందర శివాంశ ప్రధానాలూ కావడం జరిగిందని నా ప్రతిపాదన.

కామం, క్రోధం, శోకం, భయం, జుగుప్స వంటివి సర్వసాధారణాలైన భావాలే కనుక నిజానికి శృంగారాది రస సమంచితాలైన కావ్యాలు ఏ సంఘంలో వెలసినవైనా సర్వమానవ సమాస్వాద్యాలు కావలసినదే! కాని, ప్రాకృత జనుల అకృత్రిమ కామాదులు మాత్రమే సర్వ మానవులకూ సమానంగా ఆస్వాద్యం అవుతున్నాయి. నాగరకత ప్రబలి సహజ ప్రవృత్తులు రంగు రంగుల దుస్తులు ధరించి కృతకములుగా తయారైన తర్వాత వివిధ సంఘాల కామ, శోకాద్యనుభూతులలో భేదం ఏర్పడింది. మ్లేచ్ఛాదిగతమైన శృంగారాదులనను శృంగారాభాసలుగా నిర్దేశించిన ప్రాచీనాలంకారికులు ఈ అంశాన్నే స్పష్టం చేస్తున్నారు. వేదాలలోనూ, భవభూతి, ఆంగ్లకవి జాన్ డన్ (John Donne) వంటి వారిలోనూ కనిపించే శృంగారాదులు నాగరకతా ముద్ర తక్కువగా ఉన్నవనీ, కాళిదాసు, షేక్స్పియర్ ప్రభృతులలో కనిపించే శృంగారాదులు నాగరకతా ముద్ర ఎక్కువగా పడినవనీ స్థూలంగా మననం గ్రహించవచ్చు. ప్రాకృతభావాలు సత్య, సౌందర్యాంశ సమప్రధానాలు; నాగరక భావాలు సత్యాంశ దూరములూ, కేవల సౌందర్యాంశ ప్రధానములూ!

పాశ్చాత్య సాహిత్యాల ప్రభావం వల్ల దేశ భక్తి, జాతీయతాభావం, అకామ శృంగారం (Platonic love), సామ్యవాద ప్రబోధం వంటి కొత్త విలువలు ఎన్నో మనం అలవరుచుకున్న మాట నిజమే అయినా, ఆ పాశ్చాత్య సాహిత్యాలను కూడా సూక్ష్మంగా పరిశీలించి చూస్తే భారతీయ సాహిత్యాలలో మనం గుర్తించిన ప్రధానమైన విలువలు మూడింటినే వాటిలోనూ మనం దర్శించవచ్చును. తాత్త్విక దృష్టి (Metaphysical), నైతిక దృష్టి (didactic), ఊహాను భూతి ప్రధానమైన ఆత్మాశ్రయ దృష్టి (lyrical) - ఈ మూడే సర్వ సాహిత్యాలలోనూ ప్రధానమైన విలువలు, ఆయా దేశాలలో, ఆయా కాలాలలో ఆయా విలక్షణ పరిస్థితుల కనుగుణంగా ఒక్కొక్క దృష్టికి ఎక్కువ విలువ ఏర్పడుతూ వచ్చింది.

ఏ సంఘం సాహిత్యం ఆ సంఘం వారికే ఉద్దిష్టమైంది గద - ఇతర సంఘాల వారికి అది అస్వాద్యం కాకపోతే ఏమి ఇబ్బంది?' అని అడుగవచ్చు. పారిశ్రామిక నాగరకత అవతరించక పూర్వం హాయిగా ఏ సంఘాని కా సంఘం ఇతర సంఘాలను గూర్చిన ఎలాంటి ప్రసక్తి లేకుండా తన సంవృత స్వర్గంలో తాసుఖంగా జీవిస్తున్న కాలంలో ఆ మాట కొంత వరకు నిజమే! కాని, ఏ సంఘమూ తాను ఎంత వద్దనుకున్నా ఇతర సంఘాల సంపర్కం లేకుండా జీవించడం ఈనాడు సాధ్యంకాదు. ప్రపంచంలో ఏ మారుమూల లేచిన ఏ నూతన భావతరంగమైనా నిమిషాల మీద జగత్తు నలుమూలలకూ ప్రాకి, తెలిసో, తెలియకుండానో అందరిలో సమానంగా సంచలనం కలిగిస్తున్న రోజులివి. ప్రపంచ సాహిత్యాలు అన్యోన్య ప్రభావితము లవుతూ విలువలు ఏకీకృతం అయిపోతున్న రోజులివి. ఈ సంగతి గుర్తించి సాహిత్యపు విలువలను గూర్చిన తమ భావాలను కాలానుగుణంగా సవరించుకోడానికీ, నేటి ప్రపంచ సాహిత్య ధోరణి కనుగుణమైన తమ 'ఉపనిషద్ భారత' దృష్టిని పునరుద్ధరించుకోడానికీ భారతీయ సాహిత్యాలు ఎంత త్వరగా ప్రయత్నిస్తే అంత మంచిది.

ఈ వ్యాసం ముగించే ముందు ఇంత వరకు చర్చించిన అంశాలను ఒక్క సారి పునశ్చరణ చేస్తాను. విలువలను గూర్చి చర్చించని సాహిత్య విమర్శ ఎలాంటి ప్రయోజనమూ సాధింపజాలదు. సంఘాచారాలతో పెనవేసుకున్న భావాలకంటె సర్వ మానవ సమానమైన అనుభూతులు మరింత ఎక్కువగా ఆదరించ దగ్గవి. సాహిత్యానికి సౌందర్య దృష్టీ, శ్రేయోదృష్టీ కూడా ఆవశ్యకమే అయినా,

సాహిత్యం అభినయం కాకూడదు; ఆత్మని వేదన కావాలి!

